శ్రీ ర స్తు.

# మయవాస్తుశాస్త్రము

## ఆంధ్రతాత్పర్యసహితము.

## ప్రథమాధ్యాయము.

### ౧ నవతాళము: ప్రతిమలను జేయువిధానము.

ప్రతిమాంస్యా ద్విభాగైకం తద్భాగం పునరేవచ,
శేషభాగం ద్విభాగంచ తథా శేషం త్రిభాగకమ్.

ప్రతిమపొడవు ననుసరించి తాటియాకు మొదలగుకొలతవస్తువులను రెండుగా భాగించి యా రెండుభాగములలో నొకభాగమును సగము చేసి తక్కినయర్థమును రెండుభాగములుగను మూఁడుభాగములుగను విభజింపవలయును.

తదే వాష్టాంగుళాద్యంతం తదర్థం మస్తకాయతమ్, కేచిత్త దూచుః కేశాగ్రం తన్మధ్యే వేదభాగికమ్, గ్రీవామానంయథాప్రోక్తం నవతాళేన చోత్తమమ్. 2

ఆకొలతసూత్రమాద్యంతములయం దెనిమిది యంగుళముల పరిమితి గలదిగ నున్నయెడల నందులోసగము (౪ అంగుళములు).

శిరముయొక్క నిడుపుగ నుండవలయును. కొందఱీశిరమును కేశాంత మని చెప్పుదురు. మధ్యమున నున్న నాలుగంగుళముల ఖండమును కంఠముకొలతగా నెఱుంగనగును. దీనినే నవతాళము చేత ముడుచునట్టి యుత్తమవిధాన మని తెలియవలయును.

ఉత్తమే నవతాళే తు మస్తకం చతురంగుళమ్,
ముఖంద్వాదశమానేన స్యాద్గ్రీవా చతురంగుళా.

ఉత్తమనవతాళమందు శిరస్సు పొడవు నాలుగంగుళములు, ముఖముపొడవు పండ్రెండంగుళములు, కంఠముపొడవు నాలుగంగుళములు కొలతగ నుండవలయును.

ఆగ్రీవ స్తనమధ్యం వై ద్వాదశాంగుళ మాయతమ్, స్తనాంతరాదినాభ్యంతం తావ దాయత ముచ్యతే, ఆనాభిమేహనాంతం చ తావదేవా యతం భవేత్. 4

కంఠము మొదలు స్తనమధ్యముపఱకు పండ్రెండంగుళముల పరిమితియు, స్తనమధ్యము మొదలు నాభివఱకు నంతియపరిమితియు, నాభిమూలము మొదలు శిశ్నమూలమువఱకును నాపండ్రెండంగుళముల పరిమితియు, మర్మమూలము మొదలు మోకాలి చివరవఱకును నిరువదినాలుగంగుళములకొలతయును కలిగియుండవలయును.

ఆజానుగుల్భపర్యంతం చతుర్వింశతిమానకమ్,
జంఘయోరుస్సమాన స్తు గుల్ఫ శ్చ చతురంగు

శమ్, ఉచ్యతే నవతాళేఽస్మి న్నష్టోత్తరశతాం గుళమ్. 5

జానుభాగము మొదలు చీలమండవఱకు నిరువదినాలుగంగుళముల పరిమితియును, పిక్కలు తొడలు సమానప్రమాణములుగను, చీలమండలు నాలుగంగుళముల ప్రమాణమును కలిగియుండవలయును. మఱియు నీనవతాళమునందు పాదములు మొదలు శిరస్సుకొనవఱకు నూటయెనిమిదియంగుళముల ప్రమాణము కలిగియుండవలయును.

ద్వాదశాంగుళమానేన పాదాయతి రుదాహృతా, అంగులీ తు సమాఖ్యాతా చతురంగుళమాయతా. 6

పాదప్రమాణము పండ్రెండంగుళము లనియు, వ్రేళ్లపొడవు నాలుగంగుళము లనియుఁ జెప్పఁబడియున్నది.

నవతాళేతు య త్ప్రోక్తం ప్రథమం ద్వాదశాంగుళమ్, కేశాంతాదిభ్రువో ర్మధ్యం తత్ర స్యా చ్చతురంగుళమ్, నాసికా తావతీ జ్ఞేయా తదాది చుబుకం తథా. 7

నవతాళమునందు మొదటచెప్పిన ముఖముయొక్కపొడవు పండ్రెండంగుళములలో, కేశాంతము మొదలు కనుబొమలనడిమివఱకు నాలుగంగుళములు, అచ్చటనుండి ముక్కుకొనవఱకు నాలుగంగుళములును, అది మొదలు గడ్డము చివరవఱకు నాలుగంగుళముల పరిమితియును గలిగియుండవలయును.

నేత్రే ద్వ్యంగుళవిస్తీర్ణే చతురంగుళ మాయతే,
కర్ణౌచ తావదాయామౌ తావదంగుళవిస్తృతౌ.

నేత్రముల వెడలుపు రెండంగుళములును, పొడవు నాలుగంగుళములును, చెవులపొడవు నాలుగంగుళములును వెడల్పు నాలుగంగుళములును గలిగియుండవలయును.

కర్ణయో రంతరం ప్రోక్తం ద్వాదశాంగుళవిస్తృతమ్, కర్ణమూలాదినాసాంత మష్టాంగుళ మితీర్యతే, నాసా ద్వ్యంగుళివిస్తారా గ్రీవాఽష్టాంగుళవిస్తృతా. 9

రెండుచెవుల నడిమిభాగముయొక్క వెడలుపు పండ్రెండంగుళముల ప్రమాణమును, చెవిగూబమొదలు ముక్కువఱకు నెనిమిదియంగుళములును, ముక్కు వెడలుపు రెండంగుళములును, కంఠము వెడలుపు రెండంగుళము లనియు తెలియవలెను.

భుజాంతరస్య విస్తార శ్చతుర్వింశతిమానతః,
ద్వాదశాంగుళవిస్తీర్ణం స్తనమధ్య మిహోచ్యతే.

భుజాంతరపరిమాణ మిరువదినాలుగంగుళము లనియు, స్తనమధ్యప్రదేశము పండ్రెండంగుళముల ప్రమాణ మనియు నెఱుఁగవలయును.

నాభే రుపరిదేశ స్తు ద్వాద శాంగుళవిస్తృతః,
కటిదేశ శ్చతుర్వింశత్యంగుళం విపులో భవేత్.

నాభిపైభాగము పండ్రెండంగుళములవిస్తారమును, కటిప్రదేశ మిరువదినాలుగంగుళముల విస్తారమును గలిగియుండవలయును.

ద్వాదశాంగుళవిస్తార ఊరు ర్జాన్వష్ట విశ్రుతమ్,
జంఘాయావిస్తృతిస్తావ త్తదర్ధంగుల్ఫమూలకే.

తొడలమొదటిభాగపువెడల్పు పండ్రెండంగుళము లనియు, మోకాటివిస్తార మెనిమిదంగుళము లనియు, పిక్కల మొదటి భాగపువిస్తార మెనిమిదంగుళము లనియు, చీలమండల విస్తారము నాలుగంగుళములనియు తెలియవలయును.

పాదాంగుళీనాం విస్తార స్స్యాత్ షడంగుళ
మానతః. 13

కాలివ్రేళ్లవిస్తార మాఱంగుళము లని తెలియవలెను.

గ్రీవాత స్స్కంధదేశస్తు విశా మోష్టాంగుళో
భవేత్, స్కంధా దక్య త్కూర్పరాంతం తచ్చ
తుర్వింశతి రంగుళమ్, కూర్పరా న్మణిబంధాంత
మాయామోష్టాదశాంగుళమ్, మణిబంధా
త్సాంగుళీకం హ స్త స్స్యా ద్ద్వాదశాయతః. 14

కంఠభాగము మొదలు భుజముమూపురమువఱకు నెనిమిదంగుళము లనియు, భుజముమూపురము మొదలు మోచేతివఱకుగలపొడవు యిరువదినాలుగంగుళము లనియు, మోచేయిమొదలు మణికట్టువఱకు పొడవు పదునెనిమిదియంగుళము లనియు, మణికట్టు మొదలు నడిమివ్రేలికొనవఱకును గలపొడవు పండ్రెండంగుళము లనియు నెఱుంగవలయును.

విపులం భుజమూలం తు స్యాత్ షడంగుళమా
నతః, కూర్పరస్య తు విస్తారం పంచాగుళ ముదీ

రితమ్, మణిబంధస్య వైపుల్యం చతురంగుళ, ముచ్యతే, విస్తృతాంగుళిహస్తస్య విస్తారంస్యా త్షడంగుళమ్. 15

బాహుమూలముయొక్క వెడలుపు ఆఱంగుళము లనియు, మోచేతివెడలుపు ఐదంగుళము లనియు, మణికట్టు విరివి నాలుగంగుళము లనియు, వ్రేళ్లుచాచిన చేతివెడలుపు ఆఱంగుళము లనియు తెలియవలయును.

## —స్త్రీవిగ్రహప్రమాణము.—

కేశాంతాంతం త్రిభాగం స్యాన్ముఖం ద్వాదశ మాత్రకమ్, గ్రీవాత్రిమాత్రకా ప్రోక్తా స్తనో ర్ధ్వం నాభిగుహ్యయోః, ఊర్ధ్వం చైవ సమా ఖ్యాత మేకైకం ద్వాదశాంగుళమ్, చతుర్వ్యం శతిమాత్రం తు జంఘాయత ముదీర్యతే, జం ఘోరుతుల్యభాగంస్యాత్త్రిమాత్రం గుల్ఫమాన కమ్, స్త్రీప్రమాణ మిదం ఖ్యాతం నిర్మితం విశ్వ కర్మణా. 16

స్త్రీవిగ్రహమునకు కేశాంతము మూడంగుళము లనియు, ముఖము పండ్రెండంగుళము లనియు, కంఠము మూడంగుళము లును, కంఠమునుండి స్తనోర్ధ్వమువఱకును పండ్రెండంగుళము లును, స్తనోర్ధ్వముమొదలు నాభివఱకుపండ్రెండంగుళములును, నాభిమొదలు గుహ్యమువఱకు పండ్రెండంగుళము లనియు,

జంఘలనిడుపు ఇరువదినాలుగంగుళము లనియు, పిక్కలకును తొడలకును కొలత సమ మనియు, పాదగుల్భములపొడవు మూడంగుళము లనియు నెఱుంగనగును. ఇట్లు విశ్వకర్మ చెప్పిన స్త్రీ ప్రమాణమని తెలియవలయును. మఱియు నీస్త్రీప్రమాణము మధ్యమనవతాళ మని తెలియవలయును.

చరణం త్వేకభాగం స్యాత్ షడ్భాగా జంఘికాభవేత్, జంఘోర్వో స్తుల్యభాగ స్స్యా న్మధ్యం య న్నాభిగుహ్యయోః, స్తననాభ్యంతరం చైవ స్తనగ్రీవాంతరం తథా, ఏకైకంతు త్రిభాగంస్యా దేకభాగో గళో మతః, ముఖం త్రిభాగం కేశాంత మేకాంశం నవతాళకమ్, ఇత్యేతే ప్రథమా స్సేధభాగా స్త్వష్ట్రా వినిర్మితాః. 17

పాదముపొడవు ఒకపాలును, దీని కాఱుభాగములు పిక్కల పొడవును, పిక్కలు తొడలు సమభాగము లనియు, నాభిగుహ్యముల యంతరము, నాభిస్తనములయంతరము, కంఠము స్తనము వీటియంతరము రెండేసిభాగము లనియు నెఱుంగవలయును. కంఠముపొడవు ఒకభాగ మనియు, దీనికి ముఖము మూఁడు భాగము లధిక మనియు, ముఖము మొదలు కేశాంతమువఱకు నొక్కొకభాగ మనియు తెలియవలయును. మఱియు నీయిరువదియేడుభాగములును త్వష్టచేత నిర్మింపఁబడిన నవతాళ మని యెఱుంగవలయును. ఇది ప్రతిమలపొడవుయొక్కభాగము లని యెఱుంగవలయును.

అంగుష్ఠకాగ్రం స్తనచూచుకాంతం
దేవస్య భక్తాభయదస్య హస్తే,
నేత్రాంతతుల్యం జలజం చ చక్రం
మధ్యే కటిస్థం వరహస్త మాహుః. 18

దేవుని యభయహస్తమందు అంగుష్ఠాగ్రము మొదలు స్తనాగ్రమువఱకును సరిగా నుండవలయును. శంఖచక్రములు, నేత్రాంతములకు సరిగా నుండవలయును. వరదహస్తము కటిమధ్యమునందుండవలయును. ఇట్లు శిల్పవిదులు చెప్పుచున్నారు.

య ద్విగ్రహో యత్పరిమాణక స్స్యా
త్తద్విగ్రహార్ధాయత మస్య పీఠమ్,
ముఖప్రమాణం ద్విగుణం ప్రమాణం
కిరీట ముచ్చైః పరికల్పయంతి. 19

ఏవిగ్రహ మెంతపొడవుగ నుండునో దానిపీఠముయొక్క నిడుపు నాభికి సమము (అనగా ప్రతిమపొడవునకు సగము)గ నుండవలయును. ముఖప్రమాణమునకు కిరీటప్రమాణము ద్విగుణముగ నుండవలయును.

దేవస్య కర్ణాంతసమప్రమాణాం
దేవీం మనుత్వష్టృముఖా వదంతి,
దేవ్యా స్తు దృష్టి స్తనమధ్యదేశా
జానూపరిస్థానగతా మనోజ్ఞా,
వ్యత్యస్తపాదాబ్జమనోహరాయా
వ్యత్యస్తమానం తు షడంగుళం స్యాత్. 20

దేవి దేవునికర్ణాంతసమప్రమాణము గలదిగనుండవలయును అని మనువు, త్వష్ట మొదలగువారు వచించిరి. దేవిదృష్టి స్తనమధ్య ప్రదేశమునుండి జానుభాగముపైకి ప్రసరించెనేని మనోహర ముగ నుండును. వ్యత్యస్తపాదములచేత సుందరముగ నుండును. దేవి వ్యత్యస్తపాదప్రమాణ మాఱంగుళములపొడవు కలిగి యుండవలయును.

మానసారం తు గార్గియం దీప్తం మారీచ మత్రి
యమ్, సర్వశాస్త్రానుసారంచ సారం మయమ
తాగమః. 21

మానసారము, గార్గియము, దీప్తము, మారీచము, ఆత్రే యము అనుశాస్త్రముల నంగీకరింపవలయును. ఐనను వీని కన్ని టికన్న మయబ్రహ్మచెప్పినశిల్పశాస్త్రము మిక్కిలి యుత్తమ మని తెలియవలయును.

మృత్తికా వృక్ష పాషాణ లోహా ద్రవ్యం సనాతన
మ్, కర్తవ్యం సకలం బేరం తన్మాన మధు నోచ్యతే.

మృత్తిక, వృక్షము, శిల, లోహము అనునట్టిద్రవ్యములు నాశనము లేనివి. కనుక నీద్రవ్యములచేత సకలము దేవతాయ తశములను వానికొలతలను ఇకమీఁద చెప్పఁబోవుచున్నాను.

హర్మ్యగర్భగృహస్తంభ ద్వారహస్తాంగుళం తు
షట్. 23

దేవుని ప్రాసాదములు, గర్భగృహములు, స్తంభములు, ద్వార ములు వీనికి ఆఱు హస్తాంగుళములపరిమితి కలిగి యుండ వలెను.

బేరమానై స్తతః పశ్చాన్మూలబేరం యథాక్ర
మమ్. 24

దేవాయతనములకొలతచేత గర్భగృహములకొలతను యథా
ప్రకారము చెప్పెదను.

త్రి చతుః పంచభాగేతు ప్రాసాదవిస్తృతే తథా,
శేషాంశో హ్యుత్తమో మధ్యః కనీయాన్స్యాదితి
మోదయః. 25

దేవప్రాసాదముయొక్క విశాలము మూఁడు, నాలుగు, అ
యిదు భాగములుగా నుండవలయును. ఇవియే యుత్తమమధ్య
మాధమము లని చెప్పఁబడును. దేవప్రాసాదమానము తొమ్మిదిభాగ
ములుచేసి యందుమూఁడుభాగములను తొలఁగించిఆఱుభాగము
లను నిలిపినయెడల నుత్తమము. తొమ్మిదిభాగములలో నాలుగు
భాగములను తొలఁగించిఅయిదుభాగములను నిలిపినయెడల మధ్య
మము. తొమ్మిదిభాగములలో నైదుభాగములను తొలఁగించినాలు
గుభాగములను నిలుపుట కనీస మని చెప్పఁబడును.

గర్భార్ధం పంచభాగేషు ద్విభాగం ద్విత్రిభాగి
కమ్, అధమం మధ్యమం శ్రేష్ఠం ప్రత్యేకం చ
త్రిధా మతమ్, నవభేదే సమాఖ్యాతే కనిష్ఠాది
త్రయం భవేత్. 26

గర్భగృహమానము సగము చేసికొనుట మధ్యమము. మరల
నారామాయామమును మూఁడుభాగములుగాఁ జేసి సరిపఱచుట
యుత్తమము. ఇట్లు తొమ్మిదిభేదములుగా కనిష్ఠమధ్యమోత్తమ
ములు చెప్పఁబడియున్నవి.

స్తంభోత్సేధసమం హీనం పాదాధిక్యే తు మ
ధ్యమమ్, సార్ధస్తంభోత్తమః ప్రోక్తో బేరాయా
మ మితి స్మృతమ్. 27

స్తంభప్రమాణము కనిష్ఠము. పాతికపాలు అధికముగనున్న యెడల మధ్యమము. స్తంభమున కర్ధ మధికముగ నున్నయెడల ఉత్తమము. ఇవి దేవప్రాసాదాయామము లని యెఱుంగ వలయును.

బేరస్య మానం త్రిగుణైకగర్భం
గర్భత్రిభాగం పరభిత్తిమానమ్,
బేరాద్యపీఠం చ తదర్ధగోముఖం
బేరస్వరూపం నరహర్మ్యమానమ్. 28

దేవప్రాసాదమునకు మూఁడవపాలు గర్భగృహ ముండవల యును. గర్భగృహముమూఁడవపాలు దేవప్రాసాదపుగోడవెడ ల్పుండవలయును. దేవపీఠమునకుసగము గోముఖప్రమాణ ముండ వలయును. ఇదియే మనుష్యులు నిర్మించు దేవాలయములస్వరూ పమని యెఱుంగవలయును.

లింగస్య తారత్రిగుణైకపీఠం పీఠస్య తారత్ర
యగర్భమానమ్, గర్భత్రిభాగం భిత్తేర్యకభిత్తి
లింగస్య రూపం ప్రాసాదమానమ్. 29

లింగముయొక్క విశాలమునకు మూఁడురెట్లధికముగా పీఠము విశాలమునకుమూఁడురెట్లధికముగా గర్భగృహముండవలయును. గర్భగృహమును మూఁడుభాగములు చేసి దానిలో నొకపాలు

గర్భగృహముగోడమొద లుండవలయును. లింగముస్వరూపమే దేవతాయతనముయొక్క స్వరూపము గనుక నీప్రమాణముచొప్పున నుండవలయును.

చతురశ్రం క్షేత్ర విస్తారంపంచభాగం విధీయతే,
భాగభాగం భవే ద్భిత్తి ర్భాగేభాగే భవంతి కా,
తన్మధ్యేపీఠికాయామం యావద్ద్వారాదివిస్త
రమ్, విస్తారద్విగుణోత్సేధం ద్వారమానం విధీ
యతే, పీఠికాయామ ముత్సేధం త్ర్యాయామ
ద్వారవిస్తరమ్, విస్తారద్విగుణోత్సేధ మేత
ద్ద్వారస్యలక్షణమ్, హర్మ్యేత్వర్ధంమహానసంహర్మ్య
ద్విగుణలక్షణమ్, మంటపార్ధంభవే ద్భద్రం భద్ర
స్యసమునందికమ్, నందికార్ధం భవేద్ద్వారం ద్వా
రద్విగుణగోపురమ్, గోపుర ద్విగుణవ్యాసం
ప్రాకారం పరివేష్టితమ్. 80

ప్రాకారము నాలుగువైపులయందు సమముగ నుండవలయును. అం దైదుభాగములను చేసి ప్రతిభాగమునందు నాలయములను నిర్మింపవలయును. వానిమధ్యయందు ద్వారములవిస్తారములకుఁ దగినట్లుపీఠముల నేర్పఱుపవలయును. విస్తారమునకు రెండురెట్లు పొడవుండవలయును. ఇది ద్వారప్రమాణ మని చెప్పఁబడియున్నది. దేవప్రాసాదమునందు సగము మహానస (వంట) గృహ ముండవలెను. దేవప్రాసాదమునకు రెండుభాగము లధికముగ మంటప ముండవలెను. మంటపమునకు సమము భద్రగృహము, భద్రగృహమునకు సమము నందిగృహము, నందిగృహమునకు

సగము ద్వారమునకు రెండుపాళ్లధికము గోపురము, గోపురము నకు రెండురెట్లు దేవాలయవిశాల ముండవలయును.

స్తంభోచ్ఛ్రాయం తు నంద్యష్టభాగై ర్హీనాస్తు ద్వారయః, త దేత ద్ద్వారమానం తు ద్విముఖం సముదీరితమ్. 31

స్తంభముయొక్క పొడవుకు సమము నందిస్థానము. దానిని తొమ్మిదిభాగములు చేసి యెనిమిదిభాగములు తగ్గించి మిగిలిన భాగము ద్వారప్రమాణ మని తెలియవలయును. ఈద్వారప్రమాణము రెండువిధములని చెప్పఁబడియున్నది.

త్ర్యర్థం పంచార్ధం చ పంచ హ స్తైభ్యో పంచ హ స్తకైః. 32

మూఁడున్నరచేతులను, అయిదున్నరచేతులను అయిదుచేతుల చేత ఒక్కొకదానిని పెంచగా అయిదుహస్తములలెక్కకు సరిపోవును.

పంచ స్యుః పంచారత్నిభ్య స్సప్తభ్యో నవకే తథా. 33

౫, ౭, కలిపిన ౧౨ అగును. అరత్ని యనఁగా నడుగు ప్రమాణ మని తెలియవలయును. దీనిని తొమ్మిదిభాగములు చేయఁగా నవక మగును. ఈనవకము నైదుపాళ్లుచేయవలయును.

శ్రేష్ఠం మధ్యం కనిష్ఠం చ త్రివిధం ప్రతిమాధ నమ్. 34

అయిదు హస్తముల మొదలు తొమ్మిదిహస్తముల వఱకు నుత్తమమధ్యమాధమప్రమాణము లగుచున్న వని యెఱుంగ వలయును.

ఇట్లు మయశిల్పశాస్త్రమునం బ్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము.

అవ. ఇంకమీఁద క్షుద్రప్రతిమాధ్యాయమును చెప్పుచున్నాఁడు:-

శ్లో. నైకత్రింశాంగులా దూర్ధ్వం షడంగుళవివర్ధ
నాత్, సప్తాధికాంగుళనవహస్తాంతం ప్రతిమో
దయః. 1

3౧ అంగుళముల నాఱంగుళములతో పెంచి భాగించిన యెడల తొమ్మిదిహస్తము లగును. ఏడంగుళముల ప్రతిమకు పొడవు సరిపడును. ఈరీతి ౧-౨౧ అంగుళములకును లెక్కించుకొన వచ్చును.

పంచారత్నప్రమాణోర్ధ్వం ద్వాదశాంశ మను

క్రమాత్, త్రయస్త్రింశతముత్సేధమానం ప్రో
క్షిప్తం పితమ్. 2

ఆయిదడుగులు మొదలుకొని ప్రతిమలకు పండ్రెండంగుళములవఱకు పొడవు కలిగియుండవలయును. ఇట్లు ముప్పది మూడంగుళవఱకును కొలతను పెద్దలు వచించియుండిరి.

సప్తషట్పంచ భాగే తు మూలబేరాయతాం
శకే, జంగమప్రతిమానాం తు దశమానం ప్రచ
క్షతే. 3

గర్భగృహమును ఏడు, ఆఱు, ఐదు పాళ్లుచేసి జంగమ ప్రతిమలకు పదివిధము లగుమానములను చెప్పుదురు.

త్రిత్రి పంచాంగుళాద్యంతం యావ ద్బేరం గృ
హే ష్వణు, అర్ధార్ధాంగుళవృద్ధం చ పంచ పం
చ ప్రమాణకమ్. 4

గృహములయందు దేవమందిరములయందు మూడంగుళములు మొదలు పదునైదంగుళములపర్యంతము పరిమితికలవిగ్రహములు పూజాయోగ్యము లని తెలియవలయును. అర్ధఅంగుళము క్రమముగ పొదిగించినయెడల అవి ప్రమాణమగును.

యజమానాంగుళే నాపి గృహ్ణీయా ద్వా య
థేప్సితమ్, క్షత్ర్యాణాంతు యవై రేవ వ్యాసా
యామాది కల్పయేత్. 5

యజమానుని యంగుళములచేత తనకు కావలసిన ప్రమాణము నుంచుకొనవలయును. చిన్నప్రతిమలకు శిల్పకారుని చేతనే యవ ప్రమాణము నేర్పరచవలయును.

సకలాకలమిశ్రాణాం మానం మానాంగులో
న్నతమ్. 6

కళతోఁ గూడిన విగ్రహములకును కళ లేని విగ్రహములకును మిశ్రవిగ్రహములకును, కొలత మానాంగుళములుగా నుండవలయును.

యజమాన సముత్సేధం శ్రేష్ఠ మష్టాంశహీన
కమ్, అధమంతు దశాంశోనం మధ్యమం బేరము
చ్యతే. 7

యజమానుని ప్రమాణమునకు సమమైన ప్రమాణము శ్రేష్ఠము. ఇందెనిమిదవపాలు తగ్గించిన నధమ మనఁబడును. పదియవభాగము తగ్గించిన మధ్యమ మనఁబడును.

రూపిణీ రూపకర్తాతు కర్తవ్యా స్యాదితినిశ్చయః.

శిల్పములను చేయువాఁడు సుందర ప్రతిమలను చేయవలెను.

అథవా బాహుసీమాంతం స్తనాంతం నాభిసీ
మకమ్, శ్రేష్ఠం మధ్యం కనిష్ఠం చ కుబ్జం వామ
నకం త్యజేత్. 8

అట్లు కాని యెడల భుజములవఱకును, స్తనములవఱకును, నాభి వఱకును అంగీకరించిరేని యుత్తమమధ్యమాధమ ప్రమాణములం

గా నంగీకరింప నగును. యజమానుఁడు గాని, పొట్టి యా కృతిగలవాఁ డయ్యేనేని వాని ప్రమాణము నంగీకరింపఁ దగదు.

శిల్పప్రమాణం కర్తవ్యం సర్వథా తు విధీయతే.

విగ్రహాములను చేయుశిల్పియొక్క కొలత సర్వవిధములచే నంగీకరింపవలయును.

థాపుగర్భగృహస్తంభద్వారము క్తంయథావిధి,
లబ్ధోచ్ఛ్రం మానమాత్రైస్తు బుద్ధిమాన్ విభజే
త్సుకమ్. 10

దేవప్రాసాదముయొక్క పొడవును సర్వవిధములచేతను బుద్ధిమంతుఁ డగుశిల్పి మాత్రాంగుళములచేత విభజింపవలయును. దేవప్రాసాదగర్భగృహ స్తంభములును, ద్వారములును యథావిధి చెప్పఁబడినవి.

పరమస్యాంగులీభేదే వృద్ధ్యా హాన్యాదివిచక్షణః.

నేర్పరి యగుశిల్పి మాత్రాంగుళముల కెచ్చుతగ్గు కలిగినపుడు వృద్ధిచేయుటయందును, తగ్గించుటయందును మఱియొకవిధముగా కొలతచేసి పరిపఱచవచ్చును.

ఆయుష్య ఋక్ష వారాష్ట యోన్యం శేషు శుభం
వదేత్. 12

శిల్పవేత్త దేవాలయమునకు నాయుష్యము నక్షత్రము వారము యోని అంశములను (ధనఋణములను) గణితాగతములను చేసికొని మంచిరీతిని చెప్పవలయును.

ఆయవ్యయౌ భవే న్నిత్యం ధనం నిర్ధన మేవచ॥

ధనఋణము లనఁగా నాయవ్యయము లని తెలియవలయును.

బేరాయామంగజబ్రహ్మావృద్ధ్యార్క-దశభిర్భ వేత్.

దేవప్రాసాదముయొక్క ఆయామవిశాలములను మొత్తము చేసి యెనిమిదిచేత తొమ్మిదిచేత భాగింపఁగా నిలిచిన మొత్తము ధన మని తెలియవలయును. పంద్రెండు చేత పెంచి, పదిచేత భాగింపఁగా మిగిలినది ఋణ మని తెలియ వలయును.

ఆయాధిక్యే వ్యయే క్షీణే మానత స్తం పనః ప
దమ్, ధనహీనే ఋణాధిక్యే బేరం తత్సర్వదోష
కమ్ 15

ధనాధిక్యమును ఋణము తక్కువయును కొలతచేత వచ్చిన లబ్ధమువలన దొరకినయెడల శ్రేష్ఠము. ఋణాధిక్యమును ధన హీనతయు వచ్చినయెడల నుత్తమము కాదనియు, ననేకదోష ములు కలుగు ననియు చెప్పుదురు.

కృత్వా నవగుణం బేరం సప్తభి ర్హ్రారతే తథా,
శిష్టసూర్యాదివారం తు క్రూరవర్జం శుభం
నయేత్. 16

గృహాయామవిశాలపదమును తొమ్మిదిచేత పెంచి, యేడు చేత భాగింపఁగా సూర్యవారము మొదలు వారములు వచ్చును. అందు క్రూరము లైన ౧, ౩, ౭ సంఖ్యలను తలఁగించి శుభవార ములను గ్రహింపవలయును.

బేరోన్నతిం త్రివృద్ధ్యాఽష్టహృతం శేషంతు యో
నయః, యోని ష్వష్ట స్వయుగ్మాస్తు ప్రశస్తా నేత
రాశ్శుభాః. 17

ప్రాసాదభిత్తి ప్రమాణమును మూఁటిచేత హెంచి యెనిమిది
చేత భాగింపఁగా మిగిలినవి యోను లగును. అందు బేసిసంఖ్య
శ్రేష్ఠము. సమసంఖ్య నిందితము అనియు తెలియవలయును.

ఉత్సేధే త్రియుగా ద్వ్యబ్ధే సప్తవింశతితో హరే
త్, శేష మాశ్వ్యయుగాద్యం తు నక్షత్రం తచ్చ
తుర్గుణే, హృతేతు నందిభి శ్శేష ముదితం తస్క
రాదిభిః. 18

దేవభవనమానమును (అనఁగా పొడవును) ఆఱుచేత హెంచి
౨౭ చేతభాగింపఁగా శేషము అశ్విని మొదలు నక్షత్రములగును.
ఆనక్షత్రసంఖ్యను నాలుగుచేత హెంచి తొమ్మిదిచేత భాగిం
పఁగా శేషము తస్కరాద్యంశము లగును.

తస్కరో భుక్తి సౌఖ్యేచ ధనీ నరపతి స్తథా,
అభయం చ దరిద్రం చ సమృద్ధి ర్నిందితం తథా.
న వై తే హ్యంశకా స్తత్ర కీర్తితా స్సుశ్రీ ర్యథా
క్రమమ్, శ్రేష్ఠా షడంశా దారిద్ర్యం తస్కరం
నిందితం త్యజేత్. 20

తస్కరుఁడు, భుక్తి, సౌఖ్యము, ధనికుఁడు, నరపతి,

అభయము, దరిద్రము, సమృద్ధి, నిందితము అనునీతొమ్మిదింటిని నవాంశ లనిచెప్పుచున్నారు. ఇందు భుక్తి, సౌఖ్య, ధని, నర పతి, అభయము, సమృద్ధియు ననునీయాఱు నుత్తమములు. దరిద్ర, తస్కర; నిందితాంశములుమూఁడును నిందితములు కనుక విడువవలయును.

గ్రామాదీనాం చ కర్తౄణాం
హీన మ్మాతుం చ నిందితమ్. 21

గ్రామనక్షత్రములను దేవాలయనక్షత్రములను పనికిరాని నక్షత్రములను విడువవలయును.

ఆయాదికే తు షడ్వర్గం
గృహ్ణీయా ద్య చ్ఛుభావహామ్,
తస్మా త్సర్వప్రయత్నేన
ఆయాది స్సంపదః పదమ్. 22

ఆయాదికమునందు శుభమును కలుగ చేయునట్టి షడ్వర్గము నైనను గణితాగణితముగ చేసి గ్రహింపవలయును. ఆయాదికము శుభముగా నున్న యెడల సకలసంపదలకు కారణమని యెఱుంగు.

బేరనక్షత్ర మారభ్య
కర్తృతా రావసానకమ్,
గణయిత్వా హరే ద్రంధ్రై
శ్శిష్టం చే త్త్రికపంచకమ్,

సప్తకం నిందితం ప్రాహు
రన్యసంఖ్యాశ్శుభావహాః. 23

దేవాలయనక్షత్రము మొదలు దేవాలయము కల్పించు యజమానినక్షత్రమువఱకు లెక్కించి తొమ్మిదిచేత భాగింపఁగా మిగిలినసంఖ్యలో 3, 5, 7 సంఖ్యలు నిందితములు. తక్కిన 1, 2, 4, 6, 8, 9 సంఖ్యలు శుభకరము లని యెఱుంగవలయును.

గణం చేత్సురమానుష్యం శుభాం రాక్షసమా
నుషమ్, దేవరాక్షసయోశ్చైవ ద్వయం చే
న్నిందితం భవేత్. 24

దేవాలయముయొక్కయు కర్తయొక్కయు నక్షత్రములు దేవగణము లైనయెడల శుభము, ఆయుర్వృద్ధిని కలుగఁజేయును. రాక్షసమనుష్యగణము లయినను దేవరాక్షసము లయినను నిందితము లని యెఱుంగవలయును. మఱియు మనుష్యమనుష్యము, రాక్షసరాక్షసగణము శుభకరములు అనిచెప్పుచున్నారు. కనుక నిందితములను వదలి శుభగణములను గ్రహింపవలయును.

ఇట్లు మయశిల్పశాస్త్రమున ద్వితీయాధ్యాయము.

# తృతీయాధ్యాయము.

## ప్రతిమాస్వరూపనిధానము.

తేజోఽష్టనందివసునందిచతుర్నవృద్ధ్యా
హృత్వాప్తభై ర్మునిదిశేశదశగ్రహాశ్వైః,
శిష్టం హి యోని రుడువారధనర్ణ మంశం
నో యుగ్మ ముగ్ర[illegible]స్కరాద్యమ్. 1

ప్రతిమయొక్క ప్రమాణము 3, ౮, ౯, ౮, ౯, ౪ భాగములుగా నుండినయెడల వాని నంగుళములచేత గుణించి యా మొత్తమును ౮, ౨౭, ౭, ౧౨, ౧౦, ౯ సంఖ్యలచేత హరించగా శేషసంఖ్య, యోని, నక్షత్రము, వారము, ధనము, ఋణము, అంశము అగుచున్నది. వీనిలో యోనులయందు యుగ్మసంఖ్యలును, ఉగ్రనక్షత్రములును, క్రూరవారములును, అల్పధనమును, ఋణాధిక్యమును, అంశలలో నిందితము లగు తస్కర, దారిద్ర్య, నిందితాంశములు మూడును, వీనిని పరిహరించి మిగిలినశుభకరము లైననాటిని గ్రహింపవలయును.

సమవ్యాససముత్సేధా పిండధ్యా ద్వ్యామదక్షిణౌ,
వ్యాసోత్సేధాంగుళ మితి జ్ఞాత్వా కుర్యా ద్య
థావిధి. 2

ప్రతిమయొక్క కుడియెడమభాగములయందలి వెడల్పు పొడవు లను తుల అర్ధులనుగా గ్రహించి యాయంగుళములను పైనచెప్పిన చొప్పునగణించి తెలిసికొని విగ్రహములను నిర్మింప వలయును.

ప్రతిమా నిమ్నవదనా యది శిల్పీ వినశ్యతి,
చిరం న పూజ్యతే భర్తుర్విభవం నశ్యతి ధ్రువమ్.

ప్రతిమాముఖమును పల్లముగా నుండునట్లు చేసెనేని శిల్పి నశించును. ఆప్రతిమ చాలాకాలము పూజింపఁబడదు. చేయించినకర్త యైశ్వర్యము నశించును.

నాసా త్రియవమానా దప్యధికా యది కల్ప్య
తే, శీఘ్ర మేవ హి రాజానం నిహంతీతి విని
శ్చితమ్. 4

ముక్కుకోణములు మూఁడుయవల ప్రమాణముకన్న నధికముగ నుండునట్లు నిర్మించినయెడల శీఘ్రకాలమున రాష్ట్రాధిపతి మృతి నొందుటకు సంశయము లేదు.

నాసాంగుళద్వయమితాసుపుటా సుమనోహరా,
నిర్మితాచే త్సమధికా శిల్పినో ధనధాన్యహృత్.

రెండు ముక్కుకోణములును రెండంగుళముల ప్రమాణముండునట్లును, సుందరము లగుకోణము లుండునట్లును నిర్మింపవలయును. అంతకన్న నధికముగా నున్నయెడల శిలాచార్యుని ధనధాన్యములు హరించిపోవును.

నాసాహీనే శ్రియం హంతి దుఃఖం హీనే
కపోలయోః, ఉగ్రదృక్ప్రతిమా శీఘ్రం నిహ

నిష్యతి నాయకమ్, పుత్రహానింప్రకురుతే శోకం చాప్యధికం తథా, మారీవ నాశయేత్సర్వాః ప్రజాః కాలవిపర్యయే. 6

నాసికము పొట్టిగ నున్నయెడల సంపద తొలఁగును. చెక్కిళ్లు పొట్టివైనయెడల దుఃఖము కలిగించును. ఉగ్రదృష్టి కలవిగ్రహము యజమానుని నశింపఁజేయును. మఱియు పుత్త్రహానిని అధికదుఃఖమును కలుగఁజేయును. మఱియు చెడ్డకాలమునందు మారీగ్రహము (వాంతి విరేచనము)వలె ప్రజలను నశింపఁజేయును.

ఊర్ధ్వదృష్టి తు రౌద్రీ చ రాజ్ఞో రాష్ట్రం వినశ్యతి, అధోదృష్టిస్సరౌద్రీ చ అర్చకం నిహానిష్యతి, యది నాసాగ్రదృష్టి స్స్యాచ్ఛిల్పాచార్యంవినశ్యతి, పార్శ్వదృగ్బంధునాశాయ సమదృష్టిస్తు కారయేత్, సమదృష్టిస్తు శాంతా చ సర్వజీవసుఖా భవేత్. 7

రౌద్రదృష్టిఫలము మఱియొకవిధము చెప్పఁబడుచున్నది. రౌద్రదృష్టిగల పైచూపుగలవిగ్రహమును ప్రతిష్ఠించినయెడల నర్చకుఁడు నశించును. నాసాగ్రమునందు దృష్టిగలప్రతిమను ప్రతిష్ఠించినయెడల శిల్పాచార్యుఁడు నశించును. పార్శ్వదృష్టి గలవిగ్రహమును ప్రతిష్ఠించినయెడల బంధువులు నశింతురు. కనుక శిల్పాచార్యుఁడు దేవవిగ్రహములను సమదృష్టి కలవానినిగా చేసి ప్రతిష్ఠింపవలయును. శాంతమును, సమదృష్టియుఁ

గలవిగ్రహము సర్వప్రాణులకు సుఖమునుచేయును. కనుక సమ దృష్టి యుత్తమ మని చెప్పుచున్నారు.

మహానాగ స్త్వధోదృష్టి హ్యూర్ధ్వ దృష్టిమకర స్త్థా, సమదృష్టి స్తు దేవానాం పార్శ్వదృష్టి స్తు భామినీ. 8

ఏనుఁగకు క్రిందిచూపును, మకరమున కూర్ధ్వదృష్టియు, దేవతలకు సమదృష్టియును, స్త్రీలకు పార్శ్వదృష్టియు శ్రేష్ఠము లని శిల్పవిద్వాంసులు చెప్పుచున్నారు.

నాసాపుటసమో స్యేథా కపోలా చే న్న కల్పితా, పార్శ్వయుగ్మం చ హీనం స్యా త్తద్బేరం దుఃఖ దం నృణామ్. 9

ముక్కురంధ్రములకు సమముగా చెక్కిళ్లు లేకున్నను, ఇరు ప్రక్కలు హీనముగ నున్నను, అట్టివిగ్రహమును ప్రతిష్ఠించిన దేవాలయము కలగ్రామస్థులకు సకలదుఃఖములును కలుగును.

నాసికా స్యా దతిస్థూలం శిల్పినాం హంతి సంప దమ్, కపోలా చే దతిస్థూలౌ మహోపద్రవకా రకౌ, పార్శ్వస్థౌ ల్యే ప్రాణహానిః కక్షస్థౌ ల్యేఽపి శిల్పిహా. 10

దేవప్రతిమకు ముక్కు లావుగ నుండెనేని శిల్పాచార్యుని సంపద నశించును. చెక్కిళ్లు స్థూలముగ నుండినయెడల నధిక ముపద్రవము కలుగును. రెండుప్రక్కలును లావుగనుండెనేని శిల్పాచార్యునికి మృతియును గలుగును.

కంబునా సదృశ గ్రీవా సువర్ణకలశ స్తనీ,
సుకే శ్యంబుధిక న్యేవ నారీ సర్వశుభావహా. 11

శంఖమువలె మూఁడురేఖలు కలకంఠమును, బంగారుకుండల వంటి స్తనములును, మంచివంకరలు తీరి మృదు వగుతలవెండ్రు కలుగల దేవతావిగ్రహముమహాలక్ష్మివలె సకలశుభములనుగలుగఁ జేయును.

కరమానేన సదృశం చరణం పరికల్పయేత్,
సర్వసంపత్కరం ప్రాహుః శిల్పశాస్త్రవిచక్షణాః.

హస్తప్రమాణమునకు సమానముగా పాదములను నిర్మింపవల యును. అట్లు నిర్మించుట సకలసంపదలకు నిధానమని శిల్పవేత్త లు చెప్పుచున్నారు.

హస్తాంగుళ్యః కృతా హ్రస్వాః పాదాంగుళ్యః
కృశా యది, రాజానం పీడయే ద్బింబం శయనా
సనచంక్రమైః, సమాలోచ్య తతః కుర్యా త్ప్ర
తిమాం శిల్పికో త్తమః. 13

చేతివ్రేళ్లు పొట్టివైనను, కాలివ్రేళ్లు సన్నము లైనను ఆప్ర తిమను ప్రతిష్ఠించినయజమానిని పీడించును. కనుక శిల్పాచా ర్యుఁడు పరుండునపుడును, కూర్చుండునపుడును, విహరించునపు డును బాగుగ నాలోచించి ప్రతిమలను చేయవలయును.

సము త్సేధస్య సదృశం నితంబం చే ద్వినిర్మితమ్,
నిరతం వర్ధతే భాగ్యం పూజ్యతే బహువత్సరాన్.

దేవతాప్రతిమ పాదవుకుతగినట్లు పిఱుదులును నిర్మించిన యెడల నట్టిప్రతిమనుప్రతిష్ఠించినగ్రామమునందు భాగ్యమువృద్ధి

నొందుటయే గాక నా ప్రతిమయనేకసంవత్సరములు పూజింపఁ బడును.

గుణదోషౌ చ విజ్ఞాయ శిల్పీ కుర్వీత బుద్ధిమాన్,
అన్యథా యది కుర్వీత కర్తా భర్తా వినశ్యతి. 15

బుద్ధిమంతుఁ డగుశిల్పి గుణదోషముల స్వరూపమును చక్కఁగా తెలిసి ప్రతిమలను చేయవలయును. అట్లు చేయనియెడల దేవాలయమును కట్టించినయజమానియుఁ శిల్పియును నశింతురు.

అశేషభూతోద్భవకర్మకర్తా
సురాసురాణాం చ గురు స్తథైవ,
విశ్వస్య సృష్టిస్థితినాశహేతుః
శ్రీవిశ్వకర్మాఽఖిలదేవముఖ్యః. 16

సకలమైన దేవదానవులకు నుపయోగకరము లగుచిత్రపువను లను విగ్రహములు గృహములు మొదలగువానిని చేయుటయందు బుద్ధిమంతుఁడును విశ్వమునకు సృష్టిస్థితిలయములను చేయువాఁడును సకలదేవతలకు ప్రధానుఁడును, గురువును నగువిశ్వకర్మ అందఱిలోను ముఖ్యుఁడని తెలియవలయును.

లోహపాషాణకాష్ఠానాం మృణ్మయానాం చ
శర్కరా, సుధానాం చిత్రకానాంచ బహుదతో
వినిర్మితా, సూత్రశాస్త్రక్రియాయజ్ఞమంత్రతం
త్రార్థకోవిదః, సంకల్పసూక్తపఠనం మార్జనం
చాఘమర్షణమ్, స్నానం సంధ్యా జపో హోమ
స్స్వాధ్యాయో బ్రహ్మతర్పణమ్, విశ్వకర్మకులా
చారః పూర్వాచారవిధిక్రమః. 17

లోహపుపనులను, రాతిపనులను, మట్టిపనులను గులకరాళ్ళ పనులను, సున్నపుపనులను, చిత్తరువుపనులను చేయుటయందు నేర్పరియు పడవలను కట్టి నడపుటయందును, యజ్ఞములను చేయుటయందును, మంత్రమంత్రార్థములయందును పండితుఁడును, స్నానసంకల్పము, సూక్తమంత్రపఠనము, మార్జనము, అఘమర్షణసూక్తములనుపఠించుట, దేవర్షిపితృతర్పణము,పంచ లక్షణసహితముగ స్నానము చేయుట, మఱియు, స్నానసంధ్యా జపహోమాధ్యాయపితృతర్పణములను పూర్వాచారమునసుసరించిచేయునట్టివిశ్వకర్మకులాచారము సర్వోత్తమముగా నుండియున్నది. కనుక నీపనులను చేయువారిని శిల్పాచార్యునిగాఁ జెప్పవలయును.

అన్యజాత్యానకర్తవ్యం కర్తృభర్తృకులక్షయం,
కుండశో గోళక శ్చైవ నటక శ్చర్మకారకః,
పరమూర్తిప్రవేశేన కర్తా భర్తా వినశ్యతి. 18

శిల్పివంశస్థుఁడు తప్ప నితరజాతిపనివాఁడు విగ్రహములనుచేసెనేని చేసినవాఁడును, చేయించిన యజమానియును నశింతురు. మఱియు, కుండుఁడు, గోళకుఁడు,నటకుఁడు, చర్మపుపనివాఁడు, ముక్కిడివాఁడు, బోసివాఁడు, చెవిటివాఁడు, మిక్కిలి పొడవువాఁడు, దురాచారము కలవాఁడు, కంటిలో పువ్వుకలవాఁడు; ఎడమచేతిపనివాఁడు, చదువురానివాఁడు, మొండిచేతివాఁడు, బాలుఁడు, వృద్ధుఁడు శిల్పిగాఁగూడదు.ఇతరుఁడు శిల్పిపని చేసెనేని చేసినవాఁడును, యజమానియు నశింతురు.

ఆదిమూర్తి స్స్వయం శిల్పిన భేదం శ్రుణు పార్వతి, త్రిసంధ్యావందనా చైవ గాయత్రీవేద పాఠనాత్, తజ్జిహ్వా వేదసంపన్నా తత్కర్మదీక్షయా గురుః, శిల్పినో హృదయం బ్రహ్మా చంద్రసూర్యౌ చ చక్షుషి, హస్తౌ హరిహరౌ చైవ సర్వాంగం సర్వదేవతాః, మణిబంధద్వయం చైవ గణేశ షణ్ముఖ స్తథా, కరయో స్సర్వతీర్థాని గంగా యమునా సరస్వతీ. 19

శివుఁడు పార్వతికి చెప్పిన దేమన, ఓ పార్వతీ! శిల్పాచార్యులకును, శివునకును భేద మేమియును లేదు. త్రికాలసంధ్యావందనము, గాయత్రీమంత్రజపము, వేదపాఠము వీనిచేత శిల్పాచారి నాలుక వేదమయ మైనది గనుక దీక్షాచార్యుఁడని చెప్పఁబడుచున్నాఁడు. శిల్పాచార్యునిహృదయము బ్రహ్మయును, చంద్రసూర్యులు నేత్రములును, చేతులు శివకేశవులును, సకల శరీరము సకలదేవతలును, మణికట్లురెండును గణేశసుబ్రహ్మణ్యులును, అరచేతులయందు గంగాయమునాసరస్వతీ మొదలగు సకలతీర్థములును అగుటచేత శిల్పి సకలదేవతాస్వరూపుఁడని తెలియవలెను.

దృష్టినిర్మాణకాలే చ ప్రాణసంస్థాపనేఽపి చ,
మంత్రతంత్రప్రభావజ్ఞః కారయేచ్ఛిల్పికోత్తమః,
స్థాణికాస్థాపనం చైవ మాచార్యో వైశ్వకర్మణః,
యజమానీవిశ్వకర్మా చ ఆదిబ్రహ్మకులోద్భవః.

దృష్టి నుంచునపుడును, ప్రాణప్రతిష్ఠ చేయుసమయము

నందును, శిల్పి మంత్రతంత్రప్రభావముతో కూడియుండవల
యును. మఱియు స్థాణిక (మయపుదూలము) ఎత్తునపుడు శిల్పి
యును, యజమానియు ఆదిబ్రహ్మావంశమునందు పుట్టినవా రని
తెలియవలయును.

పూర్వం శిల్పీ ప్రతిష్ఠాప్య ద్వితీయా బ్రాహ్మణైః
కృతా, అన్యథా కీర్తితం తత్తు రూపం నిర్జీవ
మేవ హి. 21

శిల్పాచారి దేవప్రతిష్ఠకు ముందు ప్రాణప్రతిష్ఠచేయవల
యును. అనంతరమందు బ్రాహ్మణులు ప్రాణప్రతిష్ఠ పూజ
చేయవలయును. ఇట్లు చేయనియెడల ఆప్రతిమయొక్కస్వరూ
పము నిర్జీవ మని తెలియవలయును.

జలధాన్యాధివాసంచ శిల్పాచార్యేన కారయేత్,
అన్యజాత్యా న కర్తవ్యం కర్తా భర్తా వినశ్యతి.

జలాధివాసధాన్యాధివాసములనుశిల్పాచార్యుఁడే చేయ
వలయును. ఇతరజాతివారు చేయకూడదు. చేసిరేని వారును,
యజమానియును నశింతురు. మఱియు నాప్రతిమాస్వరూపమును
జీవము లేని దగును.

శిల్పీ మాతా శిలా పుత్రో దాసత్వం సర్వపూ
జకాః, కర్తవ్య ఇంద్రభోగ శ్చే దిదం త్రివిధ
లక్షణమ్. 23

శిల్పాచారి తల్లి, శిల పుత్త్రుఁడు, పూజసేయువారు
సేవకులు. ఇవి యన్నియుసిద్ధించినయెడల నింద్రసమానభోగము
జరుగును. ఇది త్రివిధలక్షణమని తెలియవలయును.

మాతా మోహం పితా శిల్పీ పుత్రాంశ్చ సర్వ
దేవతాః, సర్వేషాం త్వష్టృపుత్రాణాం దీక్షా
మోక్షకరో గురుః. 24

మోహము తల్లియనియు,శిల్పాచార్యుఁడు తండ్రియనియు, సకలదేవతలు పుత్త్రులనియుఁ తెలియవలయును. సకలమైనత్వష్ట్ర పుత్త్రులకును దీక్షను యిచ్చువాఁడు శిల్పాచారి గురువని యెఱుంగునది.

నేత్రోన్మీలన పాత్రం చ వస్త్రం స్వర్ణ శలాకికే,
కుంభం ధాన్యం చ ధేనుశ్చ శిల్ప్యధీన మితి
స్మృతమ్. 25

నేత్రోన్మీలనపాత్రము, వస్త్రము, నేత్రోన్మీలనస్వర్ణశలాకలును, కలశమును, ధాన్యమును, ఆవును ఇవన్నియుఁ శిల్పాచారి యధీనములని తెలియవలయును.

శిల్పిపూజా శిలాపూజా శిల్పి దుఃఖేన దుఃఖితా,
శిల్పినా కల్పితం దైవం శిల్పిబ్రహ్మమయంజగత్.

శిల్పిని పూజించినయెడల శిలను పూజించిన ట్లగును. శిల్పి దుఃఖించినయెడల శిల దుఃఖించిన ట్లగును. దైవమును శిల్పాచారి కలిగించెను గాన నీప్రపంచంబంతయును శిల్పి బ్రహ్మమయమని తెలియవలయును.

శిల్పినం పూజయే త్పూర్వం తస్య లక్షణ ముచ్యతే, ధేను ర్గజతురంగా శ్చ పల్ల క్యాందోళికం తథా, కన్యాః క్షేత్రాణి గ్రామాశ్చ ఛత్రచా

మరసంయుతమ్, సమస్తాభరణానాం శ్చాపి శిల్పినాం తృప్తిభోజనమ్, ఏ తేషాం సంప్రదాయేన కర్తవ్యం శిల్పిపూజనమ్, శిల్పినో మానసే తుష్టే దైవసంతుష్టి రేన చ, సర్వసంపత్తిసంపూర్ణం రాజా రాష్ట్రం చ వర్థతే. 27

ముందు శిల్పాచార్యుని పూజించువిధానమును చెప్పెద. ఎట్లన్నను: ఆవులు, యేనుఁగులు గుఱ్ఱములు, పల్లకి, ఆందోళికము, కన్యలు, భూములు, గ్రామములు, ఛత్రచామరములు, సర్వాభరణములు మొదలగువాని నిచ్చి, శిల్పికులస్థుల కందఱకు తృప్తిగ భోజనమును పెట్టించవలయును. శిల్పి సంతోషించినయెడల ప్రతిష్ఠించిన దేవుఁడు సంతోషించును. యజమానునికి సకలసంపదలు నిండియుండును. ప్రభునిరాజ్యము వృద్ధి నొందును.

శిల్పినా క్రియమాణేన య దపూర్ణాకృతి ర్భవేత్, శ్రేయస్కామీ న త ద్బింబం పశ్యే ద్భ్రిష్టం తదన్యథా. 28

శిల్పివిగ్రహమును చేయుచుండఁగా నవయవములు పూర్ణము కాక కొఱఁతగా నుండునపుడు ఆవిగ్రహమును మంచిని కోరు యజమానియు ఇతరులును చూడఁగూడదు. ఒకవేళ చూచెనేని యాభింబము చెడిపోవును.

బుద్బుదం పంచరాత్రం తు పవన స్సప్తరాత్రకమ్, దశరాత్రేణ పిండం స్యా త్పక్షే చైవాండరూపకమ్, మాసే శిరస ఉత్పత్తిః ద్విమాసే పత్

ముద్బుదాకృతి, త్రిమాసే చైవ సర్వాంగం చతు
ర్మాసే నఖాని చ, లోమాని పంచమాసేన షణ్మా
సే చాస్థిబంధనమ్, ప్రాణప్రవేశః సప్తమ్యా
మష్టమే జ్ఞానచింతనమ్, పూర్వజన్మకృతం ప్రాణ
జన్మాని స్మరతి క్రమాత్ 29

అయిదురాత్రములకు బుద్బుదాకారము. ఏడురాత్రములకు గాలియందు ప్రవేశించును. పదిరాత్రములకు పిండరూపమును, పదునైదు దినములకు గ్రుడ్డురూపమును పొందును. ఒకటవమాసమునకు శిరస్సు యేర్పడును. రెండుమాసములకు పార్శ్వము లేర్పడును. మూఁడుమాసములకు సకలావయవాంతరము లేర్పడును. నాలుగుమాసములకు గోళ్లు యేర్పడును. ఐదుమాసములకు వెండ్రుకలు మొలచును. ఆఱుమాసములకు అస్థిబంధము లేర్పడును. ఏడుమాసములకు ప్రాణము ప్రవేశించును. ఎనిమిదవమాసమునందు జ్ఞానచింత కలుగును. పూర్వజన్మసంబంధమును ప్రాణి యెటుల స్మరించునో అటులనే తాన యజమాని అవయవములు పూర్ణముకాకమునుపు చూడఁగూడదు.

సమర్థం శిల్పినం పూజ్య యయా దృష్టిపథే
క్రమాత్, కుంభం ధేనుం చ కన్యా శ్చ సర్వా
భరణభూషితాః, ధాన్యం దీపాః ద్విజక్షత్రవై
శ్యశూద్రజఘన్యజాన్. 30

ప్రతిమకు దృష్టి నుంచినపిదప సమర్థుఁడగు శిల్పికారునకు పూర్ణకలశము, ఆవు, కన్యకలు, సకలాభరణములు, ధాన్యములు,

దీపములు వీటిని ముందు కనుపఱచవలయును. పిమ్మట బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులును ఇతరజాతులవారును ప్రతిమను చూడవలయును.

శిల్పినమస్క్రియా పూర్వం దేవరూపధరో య
తః పశ్చాద్బ్రాహ్మణరాజానో వైశ్యా శూద్రా
ఇతి క్రమాత్. 31

శిల్పాచార్యుఁడు దేవతలకు రూపమును కలుగ చేసినవాఁడగుటచేత ముందు నమస్కరింపవలయును. పిమ్మట బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులు క్రమముగ నర్చావిగ్రహమును నమస్కరింపవలయును.

ఇట్లు మయశిల్పశాస్త్రమునందు ప్రతిమానిర్మాణమను మూఁడవయధ్యాయము సమాప్తము.

# నాలవయధ్యాయము.

## గోపురప్రాకారాదినిర్ణయము.

గోపురం సప్తధా మానం వక్ష్యే సంక్షేపతః
క్రమాత్. 1

గోపురప్రాసాదము వెడలుపు యేడువిధము లగు ప్రమాణములు కలదని తెలియవలయును.

సప్తాష్టహస్త మారభ్య ద్విద్విహస్తవివర్ధనాత్,
విస్తారం ద్విగుణోత్సేధం గోపురాణాం తముత్త
మమ్. 2

౮ చేతులపొడవు, ౭ చేతవృద్ధి జేయఁగా, ౧౮ హస్తములును, ౨౦ హస్తములును అగును. ఇట్లు చేసినయెడల విస్తారము ద్విగుణిత మగును.

ఏకాదిసప్తపర్యంతం భాగమానేన వక్ష్యతే. 3

౧ దళము మొదలు, ౭ దళములవఱకు కొలిచినయెడలభాగము లగును.

త్రయోదశాంశవిస్తారం ద్విభాగం కూటవిస్త
రమ్, పంచభాగం తు శాలాయాం శేష స్యాం
తరపంజరమ్. 4

గోపురము వెడలుపు ౧౩ భాగములును, కర్ణకూటముయొక్క వెడలుపు ౨ భాగములును చేయవలయును. మధ్యశాలయొక్క వెడలుపు ౫ భాగములును, మిగిలిన భాగమును పంజరములోను కలపవలయును.

గోపురస్య తు విస్తారం పంచభాగం విధీయతే,
ద్విభాగం భిత్తిసంయుక్తం త్రిభాగం గర్భగేహ
కమ్. 5

గోపురవిస్తారమును ౫ భాగములు చేసి, ౨ భాగములు గోడలకును, ౩ భాగములు గర్భగృహమునకును ఏర్పఱుపవలయును.

సన్నిధిద్వారమధ్యస్య సమాద్వారం హరిష్యతే,
సన్నిధిద్వారహీనం స్యాన్మంటపద్వారగోపురమ్,
అథ వా తద్విహీనం స్యాత్ప్రాకారం మధ్య
మం భవేత్. 6

దేవునిసన్నిధిప్రదేశమే గోపుర మయ్యేనేని, సన్నిధి ద్వారమునకును, గోపురద్వారమునకు నొక్కటియే సూత్రమును చేయవలయును. సన్నిధిద్వారము కాక మంటపద్వార మయ్యే నేని మంటపద్వారమున కొకసూత్రముగా నేర్పఱుపవలయును. ఇట్లు కాదేని యీరెండును నిలేయెడల ప్రాకారమధ్యభాగము నందు గోపుర ముండునట్లు చేయవలయును.

ద్వారశోభా ద్వారశాలా ద్వారప్రాసాదహర్మ్యవీ
థి, గోపురార్థం తు చత్వారి ద్వారశోభా తు
పంచమమ్. 7

తూర్పుగోపురమునకు ద్వారశోభ యనియు, దక్షిణగోపురమునకు ద్వారశాల యనియు, పశ్చిమగోపురమునకు ద్వారప్రాసాదమనియు, ఉత్తరగోపురమునకు హర్మ్యవీధి యనియు నామములు కలిగియున్నవి. ఇట్లు నాలుగు ప్రకారములుగా చెప్పబడెను. మఱియు పశ్చిమగోపురము,తూర్పుగోపురమువిడంబము కలిగియుండవలయును.

ద్వారద్విభాగ మాధిక్య మాయతం చతురశ్ర
కమ్. 8

ద్వారము వెడలుపును ౨ భాగములుచేసి వృద్ధిపరుపవలయును. ఆయామము చతురశ్రముగ నుండవలయును. చతురశ్రమాన మును రెండుభాగములుగను, పొడవు మూడుభాగములుగను చెప్పఁబడెను.

ఉత్తరాంతసమోత్సేధం తదర్ధం ద్వారవిస్తృతమ్, విస్తారద్విగుణోత్సేధ మేత ద్ద్వారస్య లక్షణమ్. 9

గోపురపుయుత్తరాంతముయొక్క పొడవునకు ద్వారము వెడలుపు సగ ముండవలయును. ఇది గోపురద్వారలక్షణ మని తెలియవలయును.

త్రిభాగాఖ్యం త మాయామం మధ్యభాగాని విస్తృతమ్. 10

అట్లు కాదేని గోపురముపొడవును మూడుభాగములు చేసి నడిమిభాగమును ద్వారమునకు ఏర్పరుపవలయును.

అధిష్ఠానసమోత్సేధం వేదికాయాంతమిష్యతే.

పునాదిపొడ వెంత యుండునో, అరుగునకు(వేదికకు)అంత పొడవు కలిగియుండునట్లు నిర్మింపవలయును.

ఇట్లు మయశిల్పశాస్త్రమునందు గోపురనిర్మాణమను నాలవయధ్యాయము సమాప్తము.

మయశాస్త్రము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1926.

# సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| బాలరామాయణము, సటీక | 0 | 2 |
| ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యవిశేషార్థసహితశ్రీమద్రామాయణము, షట్కాండలు, 15 వాల్యములు | 70 | 0 |
| శ్రీమద్రామాయణము, మూలము | 3 | 8 |
| ,, మేలుప్రతి, 2 వాల్యములు | 6 | 0 |
| ,, సుందరకాండము, మూలం | 1 | 0 |
| ,, ఉత్తరకాండము, మేలుప్రతి | 1 | 4 |
| అధ్యాత్మరామాయణము, మూలము | 1 | 0 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహా | 8 | 0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు | 15 | 0 |
| బాలకాండ, తాత్పర్యసహితము | 2 | 0 |
| | 3 | 0 |
| ఆరణ్యకాండము ,, | 2 | 0 |
| కిష్కింధాకాండము ,, | 2 | 8 |
| సుందరకాండము ,, | 2 | 0 |
| యుద్ధకాండము ,, | 4 | 0 |
| ఉత్తరకాండము ,, | 2 | 8 |
| కార్తీకమాహాత్మ్యము, చక్కనికూర్పు | 0 | 6 |
| కాశీమాహాత్మ్యము, తెనుగువచనము | 0 | 8 |
| గయామాహాత్మ్యం, తెనుగువచనం | 0 | 6 |
| కేదారఖండము | 0 | 12 |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్ర తాత్పర్యసహితము | 1 | 8 |
| ధనుర్మాసమాహాత్మ్యము, తాత్పర్యము | 0 | 2 |
| పద్మపురాణాంతర్గతమాఘపురాణము | 2 | 0 |

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| అమావాస్యతర్పణము | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | 0 | 2 |
| ఋగ్వేదదేవతార్చన | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | 2 | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | 0 | 2 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | 0 | 1 |
| పంచసూక్తములు, సస్వరము | 0 | 2 |
| పంచోపనిషత్తులు తైత్తిరీయము | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు | 0 | 1 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసైజు | 0 | 6 |
| మంత్రప్రశ్నములు, సస్వరము | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | 0 | 1 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు పితృమేధము మంత్రపన్నములు సహా, సస్వరము | 0 | 3 |
| యజ్ఞోపవీతధారణవిధి | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనం, మూలం | 0 | 2 |
| ,, ఆంధ్రటీకాసహితము | 0 | 4 |
| ,, ఆబ్దికమంత్రములు | 0 | 6 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | 0 | 8 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక | 2 | 0 |
| శ్రీవైష్ణవాహ్నికము | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | 0 | 4 |

| ప్రతి 1-కి | రూ. | అం. |
|---|---|---|
| రుద్రము,పురుషసూక్తమువగైరాలు | 0 | 2 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | 0 | 8 |
| ,, ద్వితీయభాగము | 1 | 0 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు | 2 | 0 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | 0 | 1 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి | 1 | 0 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | 0 | 2 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహా | 0 | 4 |
| జాతకచంద్రిక,గోపాలరత్నాకరము,సాంధ్రతాత్పర్యము | 0 | 8 |
| ముహూర్తదర్పణము, సటీక | 0 | 12 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యాన సహితము, చక్కనిప్రతి,నూతనముద్రితము | 2 | 0 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | 0 | 6 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించినప్రశ్న గ్రంథమునకు తెనుఁగు | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము | 0 | 6 |
| సర్వార్థచింతామణి, చక్కనిప్రతి | 0 | 12 |
| లఘుజాతకము,సాంధ్రతాత్పర్యము | 0 | 12 |
| భృగుసూత్రములు ,, | 0 | 6 |
| భావార్థచంద్రిక ,, | 0 | 8 |
| వృద్ధపరాశరము ,, | 0 | 10 |
| కేరళప్రశ్నము ,, | 0 | 3 |
| సనత్కుమారగృహవాస్తువు | 0 | 3 |
| వనమాల (వర్షఫణి) ,, | 0 | 3 |
| వాస్తుసర్వస్వము ,, | 0 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ంయవాస్తువు, సాంధ్రతా॰ము | 0 | 3 |
| శిల్పశాస్త్రము ,, | 0 | 3 |
| ాముద్రికశాస్త్రము, సటీక | 0 | 5 |
| ష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము | 0 | 4 |
| కునశాస్త్రము,శిఖినరసింహశతకము | 0 | 4 |
| ారావళి, సాంధ్రతాత్పర్యము | 3 | 0 |
| ఆశౌచనిర్ణయము, తెనుఁగు | 0 | 3 |
| దేవలస్మృతి, సాంధ్రటీక | 0 | 3 |
| పరాశరస్మృతి, ఆంధ్రతాత్పర్యసహి | 0 | 12 |
| బుధస్మృతి, సాంధ్రతాత్పర్యము | 0 | 2 |
| బృహస్పతిస్మృతి ,, | 0 | 3 |
| వృద్ధపరాశరస్మృతి, ,, | 0 | 2 |
| శంఖలిఖితస్మృతి ,, | 0 | 2 |
| శంఖధర్మస్మృతి, ,, | 0 | 12 |
| హారీతస్మృతి, ,, | 0 | 8 |
| అద్వైతసంగ్రహం, తెనుఁగువచనం | 0 | 2 |
| అపరోక్షానుభూతి,సాంధ్రతాత్పర్య | 0 | 4 |
| అద్వైతపంచరత్నములు ,, | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు | 0 | 2 |
| అద్వైతానుభూతి ,, | 0 | 2 |
| ఆత్మబోధము, సాంధ్రటీక, | 0 | 4 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహి | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ,, | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | 0 | 4 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు | 0 | 12 |
| పంచదశప్రకరణము,సవ్యాఖ్యానము | 1 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| పంచీకరణము, తాత్పర్యసహితము | 0 | 2 |
| ,, తెనుఁగువచనము | 0 | 2 |
| బ్రహ్మసూత్రములు, మూలము | 0 | 3 |
| ,, తెనుఁగువచనము | 12 | 0 |
| భగవద్గీతలు, మూలముమాత్రము | 0 | 4 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము, | 1 | 4 |
| ,, ,, చిన్నసైజు | 0 | 8 |
| ,,ఆనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | 0 | 8 |
| ,, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకా తాత్పర్యసహితము | 2 | 12 |
| శంకరగీతాభాష్యము, మేలుప్రతి | 1 | 8 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | 0 | 10 |
| వ్యవహారపంచకం, సాంధ్రతాత్పర్యము | 0 | 2 |
| వేదాంతస్తోత్రపంచకము ,, | 0 | 4 |
| శివగీతా, తాత్పర్యము, చిన్నసైజు | 0 | 12 |
| రామగీతా ,, | 0 | 6 |
| వివేకచూడామణి, తాత్పర్యసహితం | 0 | 12 |
| సౌందర్యలహరి, టీకాతాత్పర్యము | 0 | 4 |
| శాంతివిలాసము, తాత్పర్యసహితము | 0 | 6 |
| శుకాష్టకము, సాంధ్రతాత్పర్యము | 0 | 2 |
| హరిమీడే స్తవము ,,చక్కనికూర్పు | 0 | 4 |
| నిరాలంబోపనిషత్తుసాంధ్రతాత్పర్యము | 0 | 2 |
| అమృతబిందూపనిషత్తు,, | 0 | 2 |
| అద్వయతారకోపనిషత్తు,, | 0 | 2 |
| అథర్వశిఖోపనిషత్తు ,, | 0 | 2 |
| అథర్వశిరోపనిషత్తు ,, | 0 | 5 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కైవల్యోపనిషత్తు, సాంధ్రతాత్పర్యము | | 0 | 2 |
| ఆత్మబోధోపనిషత్తు | ,, | 0 | 2 |
| ఆరుణేయ్యోపనిషత్తు | ,, | 0 | 3 |
| ఈశావాస్యోపనిషత్తు | ,, | 0 | 4 |
| ఐతరేయోపనిషత్తు | ,, | 0 | 8 |
| కేనోపనిషత్తు | ,, | 0 | 4 |
| కృష్ణోపనిషత్తు | ,, | 0 | 2 |
| గర్భోపనిషత్తు | ,, | 0 | 2 |
| జాబాల్యుపనిషత్తు, | ,, | 0 | 2 |
| తైత్తిరీయోపనిషత్తు | ,, | 3 | 0 |
| పరమహంసోపనిషత్తు | ,, | 0 | 4 |
| బ్రహ్మోపనిషత్తు | ,, | 0 | 2 |
| ముక్తికోపనిషత్తు | ,, | 0 | 8 |
| మండలబ్రాహ్మణోపనిషత్తు,, | | 0 | 3 |
| యోగతత్త్వోపనిషత్తు | ,, | 0 | 3 |
| వజ్రసూచికోపనిషత్తు | ,, | 0 | 2 |
| వాసుదేవోపనిషత్తు | ,, | 0 | 2 |
| శారీరకోపనిషత్తు | ,, | 0 | 2 |
| స్కందోపనిషత్తు | ,, | 0 | 2 |
| సర్వసారోపనిషత్తు | ,, | 0 | 2 |
| అథర్వవేదీయప్రాణాగ్నిహోత్రోప నిషత్తు | | 0 | 3 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగువచనము | | 3 | 0 |
| ఋతుసంహారము, సాంధ్రటీక | | 0 | 8 |
| కాదంబరి, చక్కనిప్రతి | | 1 | 8 |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము | | 0 | 14 |
| డిటో టీకాతాత్పర్యసహితము | | 1 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గీతాగోవిందము, (అష్టపది) | 1 | 4 |
| దశకుమారచరిత్రము,చక్కనిహూర్పు | 0 | 12 |
| నైషధము,సవ్యాఖ్యానము,9 సర్గలు | 1 | 0 |
| పుష్పబాణవిలాసము, సటీక | 0 | 4 |
| పంచబాణవిజయము,చక్కనిహూర్పు | 0 | 4 |
| కాళిదాసప్రహసనము | 0 | 4 |
| సంస్కృత (నాగరిలిపి),బాలశిక్ష | 0 | 3 |
| బిల్హణచరిత్ర, సాంధ్రటీక | 0 | 8 |
| భర్తృహరిసుభాషితము, అట్టబైండు | 0 | 14 |
| డిటో సవ్యాఖ్యానప్రతిపదాంధ్ర టీకాపద్యతాత్పర్యసహితము | 2 | 8 |
| భాషామంజరి, సటీక, చక్కనిహూర్పు | 0 | 6 |
| భారవి, సవ్యాఖ్యానము, 9 సర్గలు | 0 | 12 |
| మణిమంజరిభేదిని, రామయోగీంద్ర విరచితము | 0 | 6 |
| భోజచరిత్ర,టీకాతాత్పర్యసహితం | 1 | 8 |
| మేఘసందేశము, సవ్యాఖ్యానము | 0 | 6 |
| డిటో టీకాతాత్పర్యసహితము | 0 | 14 |
| రఘువంశము, 10 సర్గలు, సవ్యాఖ్యాన | 1 | 0 |
| రఘువంశము, సటీక, మేలుప్రతి | 5 | 0 |
| రామాయణచంపు, సవ్యాఖ్యానము | 2 | 0 |
| విశ్వగుణాదర్శము, మేలుప్రతి | 1 | 0 |
| వసంతతిలకభాణము,చక్కనిహూర్పు | 0 | 4 |
| విక్రమార్కచరిత్రము, సటీక | 1 | 0 |
| హితోపదేశము | 0 | 8 |
| అథర్వణకారికావళి | 1 | 0 |
| చంద్రాలోకము, సటీక | 0 | 8 |